తోపేతంబుగ డాకినీసమదయుం బుష్పించుచు స్వరత్న
వ్యాపారంబులఁ దోఁచుసూపఁ జెలఁగెఁ వ్యక్తస్వరూపంబునన్. 32

ఉ. అంతఁ బ్రసన్నయై నిలిచి యార్తశరణ్యుని నిన్ను మెచ్చితిం
జింతిత మైన కార్య *మిదె చేకుఱ నిచ్చెద వేఁడు మన్న భూ
కాంతుఁడు మ్రొక్కి నీకృప గల్గిన నేమి కొఱంత నేఁడు నా
కింతియు చాలు మర్త్యబలి యెన్నఁడుఁ గోరక పూజ లొందుమా. 33

మ. అని ప్రార్థింపఁగఁ బూజకుండు నట దివ్యాకారుఁడై యంబరం
బున భాసిల్లుచు నిల్చి ఖేచరుఁడఁ †గర్వారాంగుఁడ న్నేఁ గుబే
రుని శాపంబున స్రుక్కి యీగతి నతిక్రూరుండనై యిప్డు డో
జననాథా భవదాగమంబు కలిమి న్పాపాసధిం బొందితిన్. 34

క. నావుడు వెఱఁ గందుచు నీ, కేవిధమున శాప ‡మయ్యె నీకథ తెలియం
గా వినిపింపుము మాకని, భూవల్లభుఁ డడుగ దివ్యపురుషుఁడు నల్లెన్. 35

గీ. ధనదు దేవపూజ కనువగుకొ్రవ్వరు, లెచట నైనఁ గోసి యేన తెత్తుఁ
× గదెల్లవాఱ విరులు దేనొక నాఁ డేగి, మధువనమున నొక్కమగువఁ గంటి.

క. అన్నెలఁతుక యెదురను సుర, పొన్నలు గోయంగవచ్చి పుష్పాయుధుచే
నున్న నెఱవాదియమ్ములఁ, గన్నులఁ జగునున్న చెలియుకడకుం జనియెన్.

క. అట చని మదిసమ్మద ము, త్కటముగ నఖఁ గౌఁగిలించి కానఁగరా వో
విటవంచని §యిన్నిదినము, లెట పోయితి వనిన నదియు నిట్లని పలికెన్.

క. రతిలంపటుఁడును శృంగా, రతిలకుఁడు నగఁగ పిటులు రసికత్వమునన్
క్షితిఁ దిరుగుచు ∥నా పెర వ, ద్భుతముగ వినినన్నుఁ గలువఁబూనికడంకన్.

క. నాయింటికి నరుదెంచిన, నాయిద్దఱ కేను జందనాగరుకస్తూ
రీయుతముగ నుపచారము, సేయించితిఁ దెక్క[1]రముగఁ జిత్తము లలరన్. 40

వ. తదనంతరంబ వారలు కుసుమంబులుం దాంబూలంబులుఁ బుచ్చుకొని యో
విటవంచనీ నీపేరు నిజంబుగ నెటువంటి విటుల నైన మోసపుత్తు వఁట నిక్క
వంబే యని యడిగిన.
40

క. కల్లలునిజములు ధర్మము, నొల్లంబును బ్రియము మోహమును నలుకయు న
య్యుల్లసము నయముసగాఁ, జెల్లును పి ... యుండు క్షితిపతులందున్.

* * * * *

*మిటు. †గర్వార ఖ్యుఁడన్. ‡శాపరు శ్చ్యె శాప మెుడ వె. × కాన కరిగి విరులు దేనొక నాఁ
డిచ్చు. §యిన్నాళ్ళు. ∥నా పేద్భుత. 1 తెక్కరముగ.

సీ. మఱియు నొక్కండు బ్రాహ్మణవిటుం డనువరి ననుఁగోరి చనుదెంచినాకు నైన
తగులెల్ల విని నన్ను దర్శింప మఱి యుపాయము లేక సురపొన్న లమరఁగట్టి
మూఁ డెత్తులుగఁ జేసి మును మాలకరి వోలె నేతెంచి నాచేతి కిచ్చినంత
నిరుదెసలం దున్న యిద్దఱ కొసఁగి యం దొక్కటి నేఁ గొన నుత్సహించి
యందుఁ దేనె గ్రోలు నళిఁ జూచి యిదియును
క్షణము సౌఖ్యమొందుఁగాక యంచు
ముడిచికొనక దండఁ దొడమీఁద నిడుకొంటిఁ
గ్రొత్తవాని కియ్యకోలు గాఁగ. ౪౭

వ. తెరువాత వానికిఁ బసిండిటంకం బిప్పించి సంచిలోఁ బడినయప్పుడు గాని
యిది దక్కదని పలికి యీతుమ్మెద ప్రియుసు చెడకుండ మూఁగవనియొద్దిసు
రపొన్నమీఁద విడిచిపొమ్మని పీడుకొలిపిన వాఁడును నట్లు చేయుచుండని
మత్సమాగమంబునకుఁ బెక్కువిచారంబులు సేయుచు నెఱజాణయగుటం జేసి.

ఉ. నిష్ఫము సంచిలోఁ బడుట నీరజమిత్రుఁడు గ్రుంకు వేళఁగాఁ
బుష్కరనేత్ర చెప్పె నళి పొన్నపయి న్విడుమంట లోనికిన్
దుష్కరవృత్తి గా దదియు త్రోవ చుమీ యని చూపుటయ్యె నే
శుష్కవిచారము ల్వలదు సూర్యుఁడు గ్రుంకిన నంద యేగెదన్. ౪౮

క. అని నిశ్చయించుకొను నెడ, వనజాప్తుఁడు నిష్పమార్గ్రి వారిధిలోన
న్మునుఁగఁగ నెగసిన పొగక్రియ, ఘనముగఁ దిమిరంబుదిశలఁగనుకనిపర్వెన్.

గీ. అంతఁ బ్రొద్దు వుచ్చి యంధకారంబులోఁ, బొన్నయెక్కివచ్చి పొంచిపొంచి
జగతిమీఁద నొక్కశయ్యపైఁ బురుషుల, నడుమ నిద్రవోవు నన్ను లేపె. ౫౧

* * * * *

వ. పిదపనయ్యిద్దఱం గదలించి యిప్పుడు నాతోడఁ గ్రీడసల్పినవాఁ డెవ్వండు
చెప్పుఁడా యనిన వాండ్రు నొండొరులఁ జెప్పుకొని తారు గాకుండుట దెలి
సికొని *కళవళపడి యిది యేమి చోద్య మని విచారించుచు నుండఁగ,
నేను, బగలు వచ్చిన మాలకరి యప్పుడు దెచ్చిన మూఁడెత్తులలో నిరు
దెసలనున్న మీకు రెంటి నిచ్చి కడమ నాకొసంగిన దండయందుఁ దుమ్మెద
సుఖియింపని మ్మని తొడమీఁద నిడుకొనినభావంబు మీ రెఱుంగరైతిరి.

క. ఆరసికుఁ డెఱిఁగి వచ్చిన, నీరీతుల నడుమఁ గలిసి యెఱుకపడఁగ మా
†చీరలువీడ్వటిచితిమి వి,చారింపఁగ నేల నాదు జయ మాఁ గాదో. ౫౨

---

*తక్కులపడి †చీరలు పీడ్వడఁగట్టిన, సాదృశ్యం బిదియ నాదుజయ.

క. నావుడు వనితల నవ్వఁడు, గావంగా నోపు మాప్రకార మొరులకు
న్నీ వెఱఁగింపకు మని లజ్జావనతముఖాబ్జులగుచు నరిగిరి చెలియా. ౫౭

ఉ. నిన్నటిరాత్రి యీతఁడు నీగతి నిచ్చట విశ్రమించుచుం
బొన్నలు గోయవచ్చితి నపూర్వపుఁబంతము వింటివే యనం
బ్రన్నన నవ్వి యీకొలఁది పంతము లెవ్వరుఁ జేయ రివ్విలో
నిన్నిటఁ గాముకు ల్గెలువనేస్తురె యంచు నుతించె బోటియున్. ౫౮

గీ. ఇట్టిగోష్ఠి వినుచు నేను గూఢంబుగాఁ, దరువుమీఁదఁ బెద్దతడవు నిలిచి
విరులు గోసికొంచు నరిగెద నంతలో, విభుని దేవపూజ వేళ దప్పె. ౫౯

చ. అలుకుచు నేగ నాతఁడు శివార్చనవంచక మాల్యవత్తటి
న్నిలిచి దినంబు మానవుల నెత్తురు ద్రావెడి శోణితప్రియం
గొలిచి మనుష్యహంత వయి కోవెలలోపల నుండుమంచు న
న్నలిగి శపించె నీశ్వర నిరాకరణాంబికి రిత్తవోవునే. ౬౦

వ. అపుడు వడవడ వడంకుచు నే నపరాధి నైతిని బుద్ధ్యకార్యంబు వదలి దుర్గోష్ఠి విన్నదానికి ఫలం బిపు డిట్లయ్యె దేవర యానతి తప్పునా నాకెన్నండు శాపావధి యానతిమ్మని మ్రొక్కిన భవసఖుండు గొంత ప్రసన్నుండై నీ వాదేవతం గొలిచి తత్ప్రియ నుండంగ నెప్పుడే నొకవీరుండు నరబలి మానిపింపం దాఁ జేరువయ్యెడి నప్పు డాదేవిచేత శస్త్రహతిని శాపముక్తుండవు గమ్ము పొమ్మనిన- ౬౧

క. ఖేచరభావం బుడిగి వ, నేచరభావమున నిట్లు నిచ్చలుం జనుల
న్నీచుఁడనై వధియించుచు, నీచేతం బూర్వపదము నేఁడిదె కంటిన్. ౬౨

మ. అనుచుం జెప్పి కుబేరకింకరుఁడు దా నాకాశమార్గంబునం
జనియెం గ్రమ్మఱ శోణితప్రియయు నాత్మోపాలు నగ్గించి నీ
మనమారన్ మను గోరనట్టికొలఁది న్సర్వోపహారంబు నై
కొను లే మానితి నూరి కేగు మని పేర్కొల్పెం బ్రసన్నాత్మయై. ౬౩

వ. తదనంతరంబ- ౬౪

ఉ. దేవతఁ జూచి రీ జనులఁ దింటయు మాన్పితి యక్షభృత్యున
ద్భావము నొందఁ జేసితి ముదం బిట చేకుఱె నంచు వీటి కు
ర్వీవరుఁ జేగుదెంచి నిఁక వింటివె వేగము నీవు నింటికిం
బోవుట మే లనంగ విని †భోజనృపాలుఁడు క్రమ్మఱె న్వసన్. ౬౫

†భోజుఁడు క్రమ్మఱ నేగె లోనికిన్.

—॥ ఇరువదితొమ్మిదవబొమ్మకథ ॥—

క. అంభోధిశయను గమలా,సంభోగప్రౌఢు నబ్జసంభవగురునిన్
జంభారివినుతగుణసం,రంభాటోపాంధకారకరాళజ్వాలిన్. ౬౬

మ. తనచిత్తాబ్జములోఁ దలంచి మఱియున్ ధాత్రీశుఁ డాపాకశా
సనుసింహాసన మెక్కవచ్చిన సముత్సాహంబు వారించి కాం
చనపాంచాలిక వక్త్రా దానగుణవిస్తారంబున న్సాహసాం
కుని సాదృశ్యము నొందలేక యిది నీకుం జెల్లునే పార్థివా. ౬౭

క. ఆతనిదానము భువన,ఖ్యాతము సకలోపకారకారణము దయా
చాతుర్య*చతుర్విధము,త్యాతతధనకనకసముదయాకరము భువిన్. ౬౮

క. త్యాగంబున సత్కీర్తియు, యోగంబున ముక్తిసతియు నుచితం బగును
ద్యోగంబున సంపదయును, భోగంబున సుందరియుఁ బొందినఁగూడున్.

క. అనుచును ద్యాగము యోగం,బును నుద్యోగంబు నిష్టభోగంబును బెం
పొనగూడఁ దగినకాలం,బున జరపుచు నవ్విభుండు భువి యేలంగన్. ౭౦

చ. ఉరగము లెల్ల శేషులు పయోనిధు లెల్ల సుధాబ్ధు లేటు లం
బరనదు లద్రు లారజతపర్వతముల్ గ్రహము లుసుధాకరు
ల్తరువులు కల్పవృక్షములు దైవతసంఘము లన్నియు న్మహే
శ్వరు లనఁ జెల్లె నెల్లెడల †సాహసభూమణుకీర్తివర్తనన్. ౭౧

ఉ. అట్టిదినంబుల న్నృపులు నాశ్రితులుం గవితారసజ్ఞులుం
జుట్టలు మంత్రులుం దొరలు శూరులు వీరులుఁ గొల్చియుండఁగా
దిట్టతనంపుఁబ్రోక యనఁ దేఁకువ కెక్కి విదేశవర్తియా
బట్టొకఁ డేగుదెంచి జనపాలశిఖామణిఁ గాంచి పెల్లుగన్. ౭౨

సీ. బ్రహ్మాయు వని రాజుఁ బ్రస్తుతిచేసి తదాజ్ఞ సుఖాసీనుఁ డై భజించి
కవితయు సర్వలక్షణపరిజ్ఞానంబు సత్యవాదమును ధీచాతురియును
జాగంబు శౌర్యంబు సరసోక్తియును నాఁగ నియ్యేడుగుణముల నెన్నఁబడ్డ
చండపుత్రుండఁ బ్రచండవాచాలుండఁ జండపురాణదీక్షాగురుండ
నవనిపాలు రెల్ల నరిగాఁపులట్ల నా, కిచ్చుధనము లెల్ల నియ్యకొనుచు
నుత్సవమునఁదిరుగుచుండి యీజగములో, నినుమహాప్రదాతయనఁగవింటి.

---

*చాతుర్యవిదితమదియు, †సాహసభూమణుఁ డుర్వి యేలఁగన్.

సీ. సత్కీర్తి పతికిని సత్కుక్షిలోపల భువనత్రయంబును బొదలుచుండు
గావున నింతకు నీ విత్రాడిని నీదుధనము యాచకులకుఁ దల్లి సుమ్ము
తమపితృధనము లేతటి నెనఁగై కొన్న నిది భాగ మని భువి నెన్నఁబడు నె
తనకుటుంబముఁ బ్రోవఁదా నెంతప్రియపడ్డనతఁడుమహోదారుఁడనఁగఁదగు నె
తగదుగాని నీయుదారత్వమే సుని, పొగడవచ్చుఁ *దొంటిరంతు పొంటెఁదలఁచ
శమితకుజనత్వగ్గ, జయరమానంపగ్గ, విమత కేరవార్గ శక్రమార్గ. ౭౪

క. జలములు పైఁబడక మహో,నల మారును శౌర్యభాసుగా నీకోపా
నలము రిపుసతులకన్నుల, జలములు గనియారు నెంతసత్త్వం బిచటన్. ౭౫

క. కావున యశము ప్రతాపము, నే వెరవునఁ బొగడఁజెల్లు నెవ్వరి నరిగాఁ
గావింపవచ్చు దీనులఁ, గావం బ్రోవంగ నీవె కారణ మగుటన్. ౭౬

ఉ. దేవసమాన నిన్ను వినుతించుట వాంఛితసిద్ధి భూమిలో
సేవసుధేశ నీయెదుట నెన్నఁగవచ్చు మదీయజిహ్వ ల
జ్జావశ మై చలింప దిఁక సద్గుణమందఱ నన్నిటమ్యుఁ బ్ర
స్తావన చేయ నేరనియతం డతిమూఢుఁడు గానఁ జెప్పెదన్. ౭౭

గీ. విపులదుర్గ మైన వింధ్యపర్వతసీమఁ, జంద్రకాంతసౌధజాలరుచుల
రాజపురము తోడ రాయుచు నుంచిన, రత్నపురము నాఁబురంబు గలదు ౭౮

క. ఒకటొకటికంటెఁ బొడవనఁ, బ్రకటముగా వచటిహర్మ్యవంక్తులు దివి ము
ట్టికలశభవుచే వింధ్యా, ద్రికిఁగ్రతమునన్నైన కొఱంతఁ దీర్చుచునుండున్. ౭౯

క. అందు జయసేనుఁ డనఁగఁ బు, రందరసైభవుఁడు †రాజరాజ సౌఖ్యం
డిందుధరభక్తినిరతుఁడు, వందిజనప్రియుఁడు మనుజవల్లభుఁ డుండున్. ౮౦

క. అనరనాయకు వేఁడిన, దీనులు ధనవంతు లగుచు దేశములోన
స్నానవనాథులక్రియ నతి,దానంబులఁ బరఁగుదురు ప్రదాత లనంగన్. ౮౧

సీ. అట్టివిజయసేనుఁ డధికసంపత్తితో నొకనాఁడు నవవసంతోత్సవంబు
సేయ నుద్యోగించె నాయవసరమునఁ గవులును బట్లును గాయకులును
నర్తకులను నిజకీర్తి నుతించుచు సరసభావంబున సరస నడువఁ
జెలువార వారకాంతలు సుగంధద్రవ్యహస్తలై కెలఁకుల నరుగు దేర
దొరలు లెంకలుహితులుమంత్రులునుగొలువ,నశ్వరత్నము నెక్కియుద్యానభూమి
కేగి యచ్చటనొకపాదరింటిక్రేవ, సురుచిరంబగు మాకందతరువుక్రింద. ౮౨

* తొంటిపొందెతలప. † రాజరాజౌదార్యం.

శా. అర్పింపందగు పూజలెల్లఁ దగుమర్యాద న్సమర్పించి కం
దర్పుం దత్ప్రియమిత్రుని న్సముచితోత్సాహంబునం గొల్చి యే
కార్పణ్యంబును లేక యింపెనయఁగాఁ గస్తూరికస్తూరికా
కర్పూరాదివసంతఖేలనములుం గావించె నుల్లాసి యై. ౭౩

క. జనవరుఁ డయ్యుత్సవమున, మనములరఁగ యాచకులకు మాడలు పదివే
లును దొమ్మిదిలక్షలు గ్ర,క్కునని చ్చెం గిరి దిశలఁ గొనసాఁగంగన్. ౭౪

వ. ఆసమయంబున- ౭౫

ఉ. యాచకకల్పభూజ మగు మానవనాథు మహావదాన్యునిం
జూచితి వాని చేత నిలు చూఱలు గొన్నగతి న్సువస్తువు
ల్వాచతురత్వచిహ్నములు నాఁ గయికొంటి సతండు ధాత్రిలో
రాచగొనంబులం బగఁగురా జప్పుఁ గావున నెన్న నొప్పగున్. ౭౬

ఉ. అంచు నతండు రత్నపురియందలి మండలనాథచంద్రు వ
ర్ణించిన నయ్యవంతిధరణీధరుఁ డాతని చాగ మాత్మలోఁ
గొంచెముగాఁ దలంచి *నిజకోశగృహాధిపుఁ డైన లెంక నీ
క్షించి యనంతదానగుణశీలసమగ్రత †నత్యుదారుఁడై. ౭౭

చ. ఇతని కనర్ఘరత్నములయిండ్లును గాంచనమందిరంబులుం
జతురతురంగసద్మములు సామజశాలలు నూపురాద్యలం
కృతిసదనంబులుం వ్వసనగేహములుం బరిపాటిఁజూపు స
మ్మత మగువస్తుజాతము సమస్తమునుం గొనిపోవ నిమ్మటన్. ౭౮

క. అనవుఁడు భాండాగారికుఁ, డును విస్మయమందుచుం గడుంబ్రియ మడరం
దనలోన వెఱఁగుపడ నా, తనిఁదోడ్కొని యరిగి వరుసఁ దద్గృహములలోన్.

వ మదశుకానుకృతంబు లగు మరకతంబులు ను, బరిపుష్పరాగంబు లగు పుష్పరాగంబులు ను, ధామాధికంబు లగు గోమేధికంబులు ను, ప్రభాసఫలంబు లగు ముక్తాఫలంబులును, విడంబితబాలప్రవాళంబు లగు ప్రవాళంబులును, సదృష్టవైదూర్యంబు లగు వైదూర్యంబులును, యమునానీలనీలంబు లగు నీలంబులును, రుచిరాజితవజ్రంబు లగు వజ్రంబులును, గల్పితపద్మరాగంబు లగు పద్మరాగంబులును, నవధీరితమేరుశిఖరంబు లగు కనకశిఖరంబులు ను, సధరీకృతార్కతేజు లగు తేజులు ను, నుపమితదిగ్గజంబు లగు

*నిజకోశగృహస్థితుఁడైన- †నత్యుదగ్రుఁడై.

మత్తగజంబులును, గర్ణికారసువర్ణాకారంబు లగు సువర్ణాలంకారంబులును, నానాంశుకంబు లగు చీనాంశుకంబులును, గనుపట్టం జూపిన నవ్వాందివ రుండు నివ్వెఱంగంది తత్త్యాగసంపదలకుం గంపితశిరస్కుం డై యుండుందన కావటం బగువానిం గొనిపోవం దలంచి. ౯౦

క. అనుచరులచేత మణులును, గనకము మూటలుగఁ ద్వ్యప్పఁ గట్టించి నృపా
లుని గర్ణుని మీఱితి వని, కొనియాడుచు నర్థ మిట్లు గొనుచుం జనియెన్.

ఉ. ఆతఁడు చన్నపిమ్మటఁ దదర్థగృహస్థితుఁ డైన లెంక సం
ప్రీతమనస్కుఁ డై నృపుని పెంపు మనంబున సన్నుతించుచు
న్నీతియు భీతియుం గలుగ నేరుపు చొప్పడ విన్నవించె న
త్యాతత మైన యాజ్ఞ వినయంబునఁ జేతులు మోడ్చి నమ్రుఁ డై ౯౨

క. తనియంగఁ బట్టుకొనిపో, యినయర్థము కొలఁది మీకు నెఱుఁగఁగవలయు
న్ననిపించెద ననవుడు న, మ్మనుజేంద్రుఁడు చులుకఁ జూచి మందస్మితుఁ డై.

క. చనువాఁ డని నే నిచ్చిన, దనవునఁ గొని చన్నధనము సంఖ్య యెఱుఁగం
బని లే దిఁక నాయర్థము, కొనియేగినవాఁడె యెఱిఁగికొన్నం జాలుఁ. ౯౪

సీ. అనుడు నా లెంకయు నాశ్చర్యమందుచు ధరణీశ నీకు నుదారమతికి
నిప్పటియానతి యొప్పు నట్లయ్యును బలికెద నా విన్నపంబు వినుము
పయి లెక్కకాండ్రను గయికొల్పి వెఱపించి లెంక విశ్వాసంబు బొందుచేసి
ధన మెంత గల్గినఁ దాఁ జిల్లఁజూడక యాయవ్యయంబుల నఘుగవలయు
వాని వివరమెల్ల వర్గువుగాఁ గూర్చి, నెఱయఁ దెలుపు లెక్క లెఱుఁగుకొనుచు
వ్యయముపుచ్చి నిలువ వ్రాయించికైకొంట, ప్రభుల కిదియ నీతివిభవమండ్రు.

గీ. వ్రాఁతకాని నమ్మరా దర్థగృహముల, నుంచకున్న నేమి యొక్కనాఁడె
వెరసు గూడుమనినఁ గరణము పండిత, న్యాయమునఁ గనర్థము చటఁ దెచ్చు.

క. ఒకదెసఁ దెచ్చిన యాయం, బొకదిక్కునఁ జెల్లువ్రాసి యొకదెసవ్యయ ము
ట్లొకదిక్కునఁ జనవ్రాసినఁ, బ్రకటంబుగ వాఁడు మిగులఁ బాపాత్ముఁ డగుఁ.

క. వహి వారణాసి యనఁగా, మహిఁ బరఁగిన దిందుఁ గపటమార్గంబుగ నా
గ్రహమున వ్రాసినవానికి, నిహపరములు లేవు నరక మిదు రై యుండుఁ.

గీ. రానిపైఁడి చెల్లువ్రాయుట యాయంబు, తక్కువై వ్యయం బదెక్కుడౌట
లెక్క తుడుపువడుట లిపి సందియం బౌట, చెల్లు మఱచుటయును గల్లపనులు.

క. కరణము తనయేలిక కుప,కరణము నిర్ణయగుణాధికరణము ప్రజకు
న్నరణము పగవారలకును, మరణము నాఁ జెల్లు నీతిమంతుం డైనన్. ౯౯

ఉ. ప్రాలకు సందియంబుపడ న్యాయక మోసము పుట్టనీక గ
ర్వాలసుఁ డై సుశీలుఁ బడక యెప్పటికప్పటి కిష్టబుద్ధితో
నేలికచిత్తవృత్తిఁ జరియించుచు నుండియు నెద్దియైనఁ ద
త్కాల మెఱింగి చేయునది కార్యము రాజహితాధికారికిన్. ౧౦౦

క. అధికారము గైకొని బహు,విధముల నాయకుని వ్యయము వినిపింపక యే
యధికారి యడఁచె మఱి వాఁ, డధికారియె కాక పలికి నాప్తుఁ డగునా.

క. కావున నియ్యెడ నను నీ, సేవకునింగాఁ దలంచి చిత్తములోఁ గన్
భావించినయట్లైనను, నాయన్నము నవధరింపు సురలోకేంద్రా. ౧౦౨

వ. అట్లు కాదేని యెత్తువారసైన నవధరింపుమని ప్రయుక్తి యోగ్యవాస్యశిరో
మణి బట్టుపట్టుకొని చన్న రత్నధనస్వర్ణసంఖ్య చూపిన నేఁబదికోట్ల సఖు
వదిలక్ష లయ్యె ననిన నుల్లంబున సంతసిల్లి. ౧౦౩

క. తెలియఁగల దొకటి వినుమా, సెలవున నటఁ దక్క నుట్లు చేకొని చనినె
న్వల దనుచు నడ్డపెట్టక, నిలుపక పంపినది చాలు నీపని యొప్పన్. ౧౦౪

మ. అనిశం గ్రమ్మఱ బ్రెముక్తి వాఁడు సరలోకాధీశ నీయాజ్ఞఁ గాం
చనరత్నాంచితశేఖరంబు కరణి న్సర్వక్షమాధీశులు
న్వినయానమ్రశిరస్కులై శిరముల న్విఖ్యాతిగాఁ దాల్చి సే
వనివారై నెగడంగ నీ సెలవుఁ దప్పం జేయు నే నెవ్వఁడన్. ౧౦౫

క. ఎత్తఱినైనను బలిమి దన, చిత్తగతిం దగవు మీఱఁ జెప్పిన వని మా
యుత్తర మీయక చేసిన, నుత్తమసేవకుఁడు వాఁడె యుర్వీరమణా. ౧౦౬

చ. పనిచినఁ *బోనివాఁ డొకఁడు పంచినఁ దా నోరుఁ బంచు నొక్కరుం
†డను విదిగా దటంచు నెదురాడు నొకం డొకఁ డొంటిఁ బోవరా
దను నొకఁ డప్పు రోగిన నాపని గాదను నొక్కరుండు పా
ప్మునఁ గఁ జలించు నొక్కఁడు జనాధిప ‡యేడ్వురుఁ గష్టసేవకుల్. ౧౦౭

గీ. ఆజ్ఞ దప్పుట పతి యాయువు దరపుట, కాన నర్థమెంత యైన నేఁడు
వోవుఁగాక యేను దేవరయానతి, దప్పఁ జేయుదు నె హితత్వ మేది. ౧౦౮

---

*బోయిరాఁడొకఁడు. †డనునిదిగాదటంచు. ‡యార్వురు. అని మా.

వ. దేవ నీయానతి కనుగుణంబుగ నమూల్యరత్నాది సువస్తువు లెల్లను దాఁ
పురంబు సేయక చూపిన నతండు తన యిచ్చకొలంది నీ యవారితంబుగా
నింతధనంబు గొని చనియె ననిన మిక్కిలి సంతసిల్లి సర్వజ్ఞ నా లెంకకు
లక్షధనంబు ఘనదనం బొసంగెఁ గావున ౧౦౯

క. నీకంత యీవి గలుగక, యీకడ నపు గిపఁ దరంబె యేగు మనిన నా
భూకాంతునిగుణము లుపశ్లోకించుచు నృపుఁడు మగిడి లోనికిఁ జనియెన్.

— ॥ ముప్పదియవబొమ్మకథ ॥ —

వ. మఱియు నొక్క శుభావసరంబున. ౧౧౧

క. నెఱయ మగతనము గలిగియు, నొఱపుగ జగములకు దల్లియుం దండ్రియు నా
నెఱుకపడ నొప్పుమేనను, దెఱవయు మగఁడు నన దేవరఁ దలఁతున్.

మ. అనుచు న్భోజనరేశ్వరుండు మఱియు న్సత్పంబున ప్రత్నకీ
లనరమ్యం బగు సింహాసనముపై లక్ష్మీకళాసుందరా
ననుఁడై పాదసరోరుహం బిడునెడ న్వారించి యాపాంతకాం
చనపాంచాలిక యిట్లను న్సరసవాచాలత్వ మేపారఁగన్. ౧౧౩

ఉ. భోజనరేశ్వరా మగిడి పోయెద వెప్పటి యట్ల ప్రస్తుతిన్
* రాజసవృత్తి నెక్క ననురాగము సైకొని వచ్చి దింతటం
దేజముగల్గునే వసుమతిం బ్రతిలేని వదాన్యవృత్తి నూ
రా జగు విక్రమార్కు సరిగాక పదం బిడఁ జెల్ల దేరికిన్. ౧౧౪

క. అతని వదాన్యత్వము విన, మతిఁ బ్రియ మగు నేని వినుము *మందారముసం
తతదానశాలియనఁ దగు, నతనికి సరిరాక వెలుక నై తలవాంచెన్. ౧౧౫

ఉ దండితశత్రుమండలుఁడు దానగుణార్థసుతుండు వైభవా
ఖండలుఁ డార్తరక్షణనికామసముద్యతమానసుండు మా
ర్తాండసమానతేజుఁడు ప్రతాపసమగ్రభుజుండు మేదినీ
మండల మెల్ల నేలె గరిమంబున నబ్బులు నాల్గు మీరగన్. ౧౧౬

క. సాహసభూషణుఁ డొకనాఁ, డీహితమునఁ దలఁచి నిశ్చయించె కలిమిచే
నైహికసుఖమగు ధర్మో, త్సాహమునఁ బరోక్షసుఖము సమకూరఁదగున్.

క. ఈరాజ్యంబున కిటుసం, సారసుఖం బొదవె జన్మసాఫల్యముగా
నేరీతి నైన ధర్మా, చారంబున నొందవలయు స్వర్గసుఖంబున్. ౧౧౭

---

*మందారము సం, తతమును సంతానముఁ దా, నతనికి,

మ. అనుచుం గల్పిత నిశ్చయుం డగు నరేంద్రాధీశు చిత్తంబు వ
ర్తన మూహించి తదీయసన్మతికి నుత్సాహంబు రెట్టింప నో
య్యన దన్మంత్రివరుండు నక్తె నిరపాయస్వర్గసౌఖ్యంబు నీ
కనుమానం బగునే యనంతసుకృతవ్యాపారసంచారికిన్. ౧౧౯

సీ. అతిథిసత్కారంబు నార్తరక్షణమును దానంబు దయయు సత్యవ్రతంబు
తలచుగాఁ జేసినధర్మంబు తనతోడి నీడయై చనుదెంచుఁ దోడుగాఁగ
జిత్తంబు నానాఁటి చింతనూరకమున్న యూర్ధ్వనాపదలు పైపడకమున్న
ముదిమివే సంధులు వదలకమున్న రోగంబున నొక్కకీడుఁ గాకమున్న
పుణ్యమార్జింపుఁ డవసరంబునకు మొదల
గట్టియారాధనములు గూడఁబెట్టుకొన్న
జీవ మెడలంగ సుకృత మార్జింపఁజనుట
యిల్లు గాలంగ నుయి త్రవ్వనేగుటన్న. ౧౨౦

క. ఈవచనం బితరులకొఱకై వినిపింపంగవలయు నది నీకడ నా
భావిక మైనది గావున, నీవెఱుఁగని యట్టి ధర్మనిరతులు గలవే. ౧౨౧

క. నావుడుఁ గడు మదినుత్సుకుఁడై విప్రులయుండ్లుఁగృతులునర్థమువనముల్
బావులు నూతులుఁ జెఱువులు, దేవస్థానములునిలిపెఁదేఁకువకెక్కన్. ౧౨౨

ఉ. ఎక్కడఁ జూచినన్ సుకృత మిన్నికకెక్కఁగఁ గీర్తిసంపద
లెక్కునిధంబులన్ ధరణిఁ బెంపు వహింపఁగ నానరేశ్వరుం
డొక్కెడ తీర్థసేవనసముత్సుకుఁడై పరివార మెల్ల న
ల్లిక్కులయందుఁ గొల్చి చనుదేరఁగ స్వర్ద కేగ సొంపుగన్. ౧౨౩

చ. కరితురగాదిసైన్యపరికల్పితమార్గనివేశుఁ డౌచు ద
వ్వరిగి యవంతినాథుఁడు నిరంతరవారివిహారశీలసుం
దరతరరాజహంసనముదాయసమాహితశర్మద న్నిజ
స్మరణనివారితోన్నదభుజంగమదుర్మదఁ గాంచె నర్మదన్. ౧౨౪

క. కనుఁగొని కడుఁ బ్రియమున నెమ్మనమునఁ బ్రణమిల్లియచటిమాంధాతృపురం
బునవిడిసియనుచరులుఁదా, నునునదికింజని మొనిజమనోరథములరన్. ౧౨౫

మ. చనియాతీర్థములో సచేలముగ సుస్నానంబు గావించి నూ
తనవస్త్రాభరణానులేపముల గాత్రం బుజ్జ్వలస్ఫూర్తి గై
కొని రాజిల్లఁగ నిల్చి విప్రవరులన్ గోభూతిలార్థాది దా
ననిరూఢిం దనిపె న్రవిగ్రహణపుణ్యంబైన కాలంబునన్. ౧౨౬

గాలింపం గని నన్ను హీనపమునిం గాఁ జేసిన న్వచ్చినా
*నీచామేక్షణ నాదుభార్య యిట నాకిష్టంబుగా వచ్చితిన్. ౧౩౫

క. క్రమ్మఱ నిం న్నుఁడు రిపుఁడై, న్యమ్ములు పోరాడ వచ్చునవసర మని యు
ద్ధమ్మునకుఁ దోడుకడ నను, రమ్మని పుత్తెంచె నిపుడు రాజవరేణ్యా. ౧౩౬

క. నే నరుగఁగ నక్కడ నా, దానవయుద్ధమున సుదతి దలఁకెడు నిట నే
హీనవృత్తు హితుఁడు లేఁడటు, గాన సతికి నీవె ప్రాపుగాఁ దగుదధిపా.

గీ. †పాలనంబు సేయు ప్రభుఁడవు నీకంటె, నొండుచోట నుంచు టురవుగాదు
దిక్కులేని ప్రజకు దిక్కునీ వటుగాన, దయను నగసికొమ్ము తండ్రికరణి. ౧౩౮

క. అని యప్పగించి సభలో, నిను వారలుఁ జూచుచుండ విస్మయుఁడై నర్
హనుమంతునొద్దనముతో, హనుమంతుని పగిది నెగసె నాకమునకున్.

క. మిన్నంట నెగసి నరుఁడుఁ, గన్నంటిన యంతదవ్వుఁ గానంబడి య
త్యున్నతగతిఁ గనుపట్టక, చన్నం గని చోద్య మందె జనపాలుండున్.

సీ. ఆమీఁద దేవాసురాహవం బైనట్లు పంచమహానాద్యఘోషితు లెసఁగెఁ
బొడువుఁడు తలద్రెంచుఁడవుఁడు నానిట్ల పెడబొబ్బలార్పులు ముసులుపడియె
నంతలోపల హనుమంతునొద్దనముతోఁ గూడ నాతని చేయిగూలె ధరణిఁ
దరువాత కాలుతో దక్షిణహస్తంబు నందియుతోఁ గాలునట్లు పడియెఁ
దోడి కాలును దెగితోఁ ఁగెఁ జెంగులపాగ, చొల్లియంబుతో నట్రెళ్ళెఁ దలయుఁ
ద్రిండుతోఁ గూడ ‡మొండెము డిగదొర్లెఁ, గొలువులోనఁ జూడ ఘోరమయ్యె.

ఉ. ఎక్కడినుండి వచ్చెనొ యితం డెవ్వఁడొ యింద్రునిబాట నంచుఁ దా
న్నిక్కమలాక్షి నుంచి దివి కేగి సురాసురసంగరంబునం
ద్రెక్కొన న్నొక్కఁ డిల్లు కడికండలునయ్యె నటంచుఁ గొల్వులోఁ
బెక్కువిధంబుల న్నృపునిఁ బేర్కొని విస్మయమంది రందఱున్. ౧౪౨

గీ. మీఁది మునుఁగు వచ్చి మొలఁతుక యలుకలు, ఛక్కమిర్వ యప్పు డక్కజముగ
నధిపునవయవంబు లామొద్దనంబుతోఁ, గూడఁ దిగిచి బెగడుగొనకవలికె.

క. ఓనరనాయక యింకిటి, నేనుండుట తగదు సమరనిహతుని వీరు
న్నానాథుఁ గూడ నేగెద, నానతి యీవలయు నాకు నగ్నిసారంగన్. ౧౪౪

---

*ఈవామేక్షణభార్యగా క్షితితలం బిష్టంబుగా వచ్చితిన్ †భార మెల్లమాన్పు ప్రభుఁడవు- నొండుచోటఁ గార్య మొండుపుట్టు- పాపమెల్లమాన్ప- ‡మొండెములు ద్రెళ్ళె- పెడమకాలును దెగి పుడమిబడియె. గుండెలములు ద్రెళ్లె.

క. నావిని మొదలనె యాతని, చావున కతిఖిన్నుఁ డైన జనపతి కృపతో
నా వీరశక్తి జనకుని, కైవడి నినుఁ బ్రోతు నిక్క గడఁగకు మని యెన్. ౧౪౫

క. ఇది చాగమకొంత కై నీ, పదములకడ నుంచె నిక్క పతిపోయిన న
త్పదమున కేగద నమపుట, మదిఁ జూడఁగ నిది మె తంత్రినున్నన గాదే.

ఉ. ఆకులపాటుతోడ నసుభాక్కృతి మై యొకవేళ నైనఁ బోఁ
కాకును లేక సొమ్ములకు నక్కులు పాఁపక పేరటంబులం
బోక తొలంగి పూఁతలును బువ్వులు దూరముగాఁగ ముండనై
యేకడఁ జేరిన న్విధవ కెన్నఁట కాక †తరింపవచ్చునే. ౧౪౭

క. చచ్చియుఁ జావక తనలో, నెచ్చుచు నియమముల నిరత విధవాత్వమున
న్నిచ్చలు మాఁడుటకంటెను, జచ్చుటకుట మేలు సతికి క్షితి మెచ్చంగన్.

క. పతి దుఃఖితుఁ డైనను దా, నతిదుఃఖిత యగుచు మానికతఁ దనిగినఁ బీ
డిత యగుచు నతఁడు నచ్చిన, ధృతితోడన నచ్చునది పతివ్రత చుమ్మీ. ౧౪౯

గీ. పుట్టలోని పాముఁ బట్టి గారడికుండు, బలిమి వెడలఁ దిగిచి యగిది నింతి
తోడఁ జచ్చి పతి యధోగతుఁ డైనఁ దా, నుద్ధరించి సౌఖ్యమొందుచుండు.

గీ. అతని కేమికొంత పతి హితంబునఁ బ్రాణ, మిచ్చినాఁడు దివికి నేగినాఁడు
రమణుఁడగుచు నచట ‡రంభాదిసతులఁగూ, డానక మాన్పననుఁ గూడ ననుపు.

గీ. ఉరక మాన్పి తేని నుకిపెన్కొని యొండె, గూడు గట్టి నీళ్ళఁ గూలి యొండె
విసముద్రావి యొండె విడుతుఁ బ్రాణంబు లా, తగని చావుకీడు దగులునిన్ను.

సీ. ¶అటుగాక పుణ్యమా నగ్నిప్రవేశంబు చేయింపు మాకీసుచెంద దిందు
నెన్న ముక్కోటియు నేఁబదిలక్షలు మానవు మేన రోమంబు లుండు
నన్నియేండ్లును స్వర్గ మానవాయకుతోడ ననుగతయా సతి యనుభవించు
పీరుని యాల నై విధవ నై యుండుట యనుచితం బదిగాన చాగనిమ్ము
తడయనేల యనుచుఁ దనుఁ బ్రార్థించిన, మాఱు వలుక లేక మనుజవిభుఁడు
కొంత యనుమతింప నంతలోఁ దజ్ఞను, లాయితంబు చేసి రాస్తు లగుచు.

చ. ధృతి మతిఁ బొంగి రాజునకు దీవన లిచ్చి నిజాధినాథు మే
నితునుకలుం దదస్త్రములు నించి ఘృతప్లుత చందనేంధనా
న్వితమగు నగ్నికుండమున నింతి వెన న్నవనీతపుత్రికా
కృతిఁ బడి యంతలోనఁ గరఁగెన్ జనులం దఱుఁ బ్రస్తుతింపఁగాన్. ౧౫౪

* అవీరభటుని చావునకై † చరింపవచ్చునే, భరింపవచ్చునే, ధరింపవచ్చునే.
‡ రంభాదిసతులను గూడకుండ- రంభాదులను గూడుకొనక మున్ను- ¶ అటుగాన యుక్తమా.

గీ. అనుచు వెఱఁగుపడుచు నవనీశుఁ డంతయు, నిద్రపాలసుగుట మొలఁగి యతని
గారవించి యెన్నికళ లభ్యసించితి, వన్ని నాకుఁ జెప్పు మనుచు నతఁడు.

గీ. పెక్కుగద్యలెఱుఁగఁ బృథ్విశ నినుఁ గొల్వ, నేర్చుఁ గొన్నికళలు నేర్చుఁ దొల్లి
వాని పేళ్లు వినఁగ వలయును జెప్పెద, దానసైన నన్నుఁ దయఁ జూడవలె.

వ. కావున నవధరింపుము నాలుగు వేదంబులు ను శిక్షాదిషడంగంబులు ను స్మృతులు ను బురాణంబులు ను బూర్వోత్తరమీమాంసలును న్యాయవిస్తారంబులు ను నితిహాసంబులు ను వాస్తుశాస్త్రంబు ను వైద్యతంత్రంబు ను నాయుర్వేదంబును ధనుర్వేదంబును విషప్రతీకారంబును మాంత్రప్రతీకారంబును గణితంబును మాంత్రికత్వంబును జలసూత్రంబును సంగీతంబును సాహిత్యంబును నుచితకృత్యంబును నాటకంబులును గావ్యంబులు నలంకారంబులు నానాదేశభాషలు ను సకలలిపిపరిచయంబు ను దూరగమనంబును దూరశ్రవణంబును ధురంధరత్వంబును, వశ్యాకర్షణాది షట్కర్మంబులును వాహనారోహణచాతురియు జలస్తంభన, శిలాస్తంభన, స్థలస్తంభన, అగ్నిస్తంభన, ఖడ్గస్తంభన, వాయుస్తంభన, రసస్తంభన, శుక్లస్తంభన, రక్తస్తంభనాదులును మహేంద్రజాలంబును, నష్టవస్తుసముద్ధరణంబును, జాతితార్థదానముష్టికరణంబును ప్రియభాషణంబును సదృశ్యీకరణంబును నదృశ్యాకర్షణంబును కృషివాణిజ్యాదులును శక్తిత్రయంబును రత్నగర్భాది పరీక్షణంబును మనుష్యాది జీవపరిరక్షణంబును ద్యూతాటఖేలనంబును యమనియమాద్యష్టాంగయోగంబును అష్టావధానంబును వైదికంబును లోకాచారంబు ను రతిరహస్యంబు ను వాద్యకౌశలంబు ను నాట్యంబును బరకాయప్రవేశంబును బరవంచనంబును, ఉపాయాపాయవివేకంబును వీరత్వంబును వాచకంబు ను గందుక కుక్కుటాండ జలపూర్ణభాండ చక్రభ్రమణంబు ను బహురూపనటనత్వంబును వేణుదండభ్రమణంబును రాజముఖ మృగముఖ స్త్రీముఖ చోరముఖ దిఙ్ముఖబంధనంబును హాలికప్రయోగంబు నాకారగుప్తియు భావజ్ఞానంబును గ్రామణికత్వంబును లేఖకత్వంబును బరిహాసంబును వాచాలకత్వంబును సిద్ధాంతప్రవృత్తియు సర్వజాతిశిల్పపరిశీలనంబును నాదీచతుష్షష్టికళలయందును దేవరసాన్నిధ్యంబునం గొంత పరిచితుండ ననిన.*

క. భూవల్లభుఁ డాతని వి,ద్యావిజ్ఞానంబు మెచ్చి తనలోపల సం
భావింపఁ దలంచునెడన్, దౌవారికుఁ డేగుదెంచి తగ నిట్లనియెన్.

* ఈవచనంబులోని చతుష్షష్టికళలును గ్రంథాంతరోక్తవిధముగా మార్పఁబడినవి, సంఖ్య హెచ్చినది.

క. ఓనరనాయక తమకుం, బూనిక ఫలియింపఁ బాండ్యభూపతిమంత్రుల్
కానుకలు గొంచు దేవరఁ, గానం జనుదెంచినారు కను వినయమునన్. ౧౨౦

గీ. అనిన వారిఁ దోడికొనిరమ్ము నావుడు, మగిడి యేగి యచటిమంత్రివరుల
వారుఁ దోడ కొనుచువచ్చిదర్శింపించెఁ, గనకరత్నచయముసుమునుముగాఁగ.

సీ. ఆమంత్రివరులు సాష్టాంగంబుగా మ్రొక్కి నిలిచి ముందరఁ గరంబులు మొగిడ్చి
జనలోకనాయక యెనిమిదికోట్లు దీనారముల్ *నూర్వురు వారసతులు
తొంబదిమూఁడు ముత్యంబుల†కావళ్లు నేఁబదినుత్తకరీంద్రములును
మున్నూఱు జవనాశ్వములును గప్పంబుగాఁ బాండ్యభూపాలుండు పంపెనీకు
నవధరించి దండయాత్ర యక్కడమాని, యతని గావవలయు ననుచు మ్రొక్కి
‡యున్నఁ గరుణఁజూచి యుర్వీశ్వరుండును, మోద మడర వారి నాదరించి.

ఉ. అర్థులు గోష్ఠి§ చేయుసమయంబున వచ్చిన దర్శనంబు న
య్యర్థుల కిచ్చెనేని ప్రభు వాతఁడె కావున విద్యవాని కా
యర్థము ముత్తియంబులు నవాంగనలుం గరులున్ హయంబులుం
బార్థివుఁ డిచ్చి పుచ్చెఁ దను బాండ్యనిమంత్రులు ప్రస్తుతింపఁగన్. ౧౨౩

క. అట్టిమహోదారుఁడు తన, పట్టణమున కేగి రాయబారులఁ గృపఁ జే
పట్టి సిరి నెగడెఁ గావున, సిట్టిగుణము లేక యెక్క నితరులతరమే. ౧౨౪

క. అనవుడు భోజుండును నె, మ్మనమున నవ్విక్రమార్కు మహనీయము లౌ
గొనములు గొనియాడుచు ని, ర్గనయుఁగ నాసొంపుదక్కి యింటికిఁ బోయెన్.

శా. శృంగారాధిపతిత్వసంజనితలక్ష్మీసంగతాంగు న్వియ
ద్గంగాశేఖరపాదపద్మునిఁ ద్రిలోకవ్యాపకుం గోవరా
హాంగీకారకృతార్థితప్రజకురంగాక్షీమనోరంగునిన్
సంగీతప్రియు సామవేదమయుఁ గంసధ్వంసి విశ్వంభరున్. ౧౨౬

శా. గంగాతుంగతరంగసంగతజటాకల్పాయమానాకృతిం
ద్వంగద్భోగభుజంగరాజఫణరత్నజ్యోతిరుద్దీప్తసా
రంగాంకద్యుతిధౌతరాజతగిరిం ద్రస్థానరంగస్థలీ
రంగద్భృంగిరిటిప్రసంగసుఖపారంపర్యధుర్యున్ శివున్. ౧౨౭

మాలిని. శశధరశకలాంకా స్సనసోనిష్టశంకా
విశదగిరినివాసీ [1]విశ్వబాధానిరాసీ

---

*యువతులు నూఱువురును †కోవిదలు- ‡విన్నవించుటయును విని యవనీపతి §చేయు
నెడలందున- చేయునెడ నప్పని [1]విశ్వబోధానురాశి.

దశముఖవరదాతా దైత్యహింసావిధాతా
పశుపతిహరిరూపా ప్రాజ్యపూజ్యస్వరూపా ! ౧౭౮

గద్యము. ఇది రాయగజగంధవారణాద్యరిమండలిక భేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాటద్రవిళాంధ్ర మహారాష్ట్ర భూపాలరూఢ నూపురసుందరచరణారవింద సనదవోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొలని వెన్నయామాత్య పౌత్ర హరితసగోత్ర పవిత్ర సకలసుకవిమిత్ర కసువరాజతనూజ గోపరాజప్రణీతంబైన సింహాసనద్వాత్రింశికయను కావ్యంబునందు సాహసాంకుని సాహసోపకారంబులును విటవంచని వంచకత్వంబును గర్వారాంగునిశాపమోక్షణంబును విక్రమార్కునౌదార్యంబు నన్నది యేకాదశాశ్వాసము.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## — ద్వాదశాశ్వాసము. —

క. శ్రీపరిరంభణసమయ, ప్రాపితనవకుంకుమాంక భాసురనిజదే
హాళికమితసాంద్రనీరద, రూపు న్సురవిమతనిహితకోపాటోపున్. ౧

చ. హృదయమునం దలంచి ధరణీశుఁడు క్రమ్మఱ నొక్కవేళ నా
త్రిదశవరాసనంబున కతి ప్రముదాస్పదమైన రాజ్యసం
పద నరుదేరఁగా నతని భావము గన్గొని యుల్ల సవ్వచుం
దదనుమతంబు మాన్పి విదితంబుగ నచ్చటిబొమ్మ యిట్లనున్. ౨

### — ముప్పదియొకటవబొమ్మకథ —

క. ముప్పదిమాఱులు క్రమ్మఱి. యప్పుడ చనుదెంచినాఁడ వాతనికథ లి
ట్లొప్పఁగదా యింకనొకకథ, చెప్పెద నీచేత నీకుఁ జెల్లదు చుమ్మీ. 3

ఉ. సజ్జనరక్షణోన్నతవిశాలభుజాయుగళుండు సర్వసం
పజ్జితకిన్నరేశ్వరుఁ డపారభటోద్భటవైరిమేదినీ
భృజ్జలజక్షపాకరుఁడు భీమబలాఢ్యుఁడు విక్రమార్కుఁ డా
యుజ్జయినీపురంబున గుణోర్జితుఁడై ధర యేలుచుండఁగన్. ౪

క. జననుతుఁడు శాంతిశీలుం, డనఁగా నొకభిక్షుకుండు హరిమూర్తికిఁ దా
నెనయగు భూవల్లభునిం, గనుఁగొనఁ జనుదెంచి ఫలము కానుక యిచ్చెన్.

క. ఇచ్చినఁ గైకొని నృపుఁ డిటు, విచ్చేయుం డనుచు గారవించుచు నతనిన్
సచ్చరితుఁ డనుచు నాసన, మిచ్చి యుచితగోష్ఠి జరపి యొలమిని ననిపెన్.

వ. ఇట్లనిపిన తదనంతరంబున- ౬

గీ. ఆఫలంబు తనగృహాధ్యక్షు చేతికి, నిచ్చి లేచి లోనికేగె విభుఁడు
మఱియు నాతపస్విమఱునాఁడు గ్రొత్తగా, నొక్కపండు దెచ్చి యొసఁగెఁ బతికి. ౭

శా. ఆపండు న్నృపుఁ డట్లు పుచ్చుకొని భాండాగారిచే నిచ్చి ని
క్లేపార న్ఫలహస్తుఁడై యవసరం బీక్షించుచు న్భిక్షుకుం
*డేప్రొద్దుం గవితావిలాసమున నక్షేందు ప్రతీకాశుఁ డా
క్ష్మాపాలుం గొలువంగ నయ్యె దశవర్షంబు లీవినోదంబుగన్. ౮

---

* దేపారం గనరాని వేషమున లంకేశప్రతీకాశుఁడై.

చ. అటు లొకనాఁడు క్రొత్తఫలం బాతఁడు దెచ్చినఁ బెంచినట్టి మ
ర్కటమున కిచ్చె నాకపియుఁ గైకొని మూర్కొని చూచి మెచ్చుచుం
గటుకనఁ బండులం గొఱుకఁగా నొకరత్నము గింజమూర్తిమం
తటఁ బడియె న్నిజప్రభలఁ దద్గృహమండప మెల్లవన్నెగాన్. ౧౦

సీ. ఆరత్న మీక్షించి యాశ్చర్యమున విభుఁ డట గృహాధ్యక్షుఁ డైనట్టి వెంకఁ
బిలిపించి యిన్నాళ్ళఫలములు దెచ్చిన నరిగి మాణిక్యంబు లైనవాని
నన్నిటిఁ దెచ్చిన *నాదాఁపుటకు మెచ్చి నాసికి నవి యిచ్చి వరుసఁ బిదప
శాంతిశీలుం డటు చనుదెంచుటయుఁ జూచి యనఘ నీవిట్టి యనర్ఘమణులు
నాకు నిచ్చి యేమి నాయెడఁ గైకొనఁ, దలఁచినాఁడ విప్పుడు విలువఁ జూడ
నొక్కరత్నమునకు నుర్వియంతయుఁ జాల, దన్నిరత్నములకు నెద్ది యిత్తు. ౧౧

క. అనవుఁడు నాభిక్షుకుఁ డో, జననాయక దీనికంటె సమధికగుణమా
పనిగలదు గాన వచ్చితి, ననఘుఁడ వభయుఁడవు సాహసాంకుఁడ వగుటన్.

చ. క్షితివర నాప్రియంబు విను కృష్ణచతుర్దశినాఁటిరాత్రి యు
న్నత మగుమఱ్ఱిక్రింద మసనంబున నున్న పిశాచపంక్తి న
న్నుతు లొనరించి హోమము మనోరథసిద్ధికిఁ జేయువాఁడ నే
కతమున నీవు నచ్చటికిఁ గ్రక్కున రక్షటు నాకుఁ దోడ్పడన్. ౧౩

చ. అనవుడు నింతకాలము ప్రయాస మిదేటికి నాఁడె చెప్పినం
బనివినవే యడంచి యొక బ్రహ్మముఁ జేసితి నేఁడు నీవు చె
ప్పిన సమయంబు దప్పక యభీష్టము నీకొనగూర్ప వచ్చెదం
జనుమని వీడుకొల్పి నృపచంద్రుఁడు మానస ముత్సహింపఁగన్. ౧౪

వ. అంతఁ గృష్ణచతుర్దశి వచ్చినం దద్రాత్రి సమయంబున. ౧౫

క. నీలాంకితభూషణములు, నీలాగురులేపనములు నీలాంబరముల్
నీలోత్పలములు నిజదే,హాలంకారములు గాఁగ నతఁ డొక్కండున్. ౧౬

సీ. కరవాలహస్తుఁ డై పురము వెల్వడి వీరభావంబుతోఁ బూర్వభాగమునను
డాకినీచండతాండవసముద్దండంబు ఘూకఘూత్కారాదిఘోరపదము
సంహృతశవదాహసమయసముజ్జ్వలచ్చటచటధ్వనివహ్నిసంకులంబు
నకుటుంబవృద్ధజంబుకభీషణాక్రోశసంతతబధిరితాశాంతరంబు

*నాడాఁపురమునకు మెచ్చివదానికి నవియిచ్చి శిరప,

కర్పరాస్థిశూలకంకాళనృకపాల, దారుణంబు భూతకారణంబు
నాగభయరసంబునకు నాస్పదం బైన, యాశ్మశానభూమి కరిగి యచట.

క. వటతరువుక్రింద ననలో,త్కటమగు గుండంబుపొంతఁ దపసిం గని యే
మట పనివంపుము నావుడు, భటభావముఁ బొగడి కార్యపరుఁడై యతఁడున్.

వ. ఇచటికిఁ గ్రోశమాత్రమున నొక్కశింశుపావృక్షం బున్నది యందు నిలుచుం డగు బేతాళుండున్నవాఁ డతనిం గొంచు రమ్ము తాను మౌనంబున గాని రాఁ డని పంచిన నట చని యనేకవిహంగభుజంగ పిశాచ బ్రహ్మరాక్షస సతతనివాసం బగు నమ్మహామహీరుహంబు డగ్గఱి తదీయశాఖావసక్తావనతచరణుండు నవలంబమానహస్తుండు ను నధోముఖుండు ను నగు నాభూత ప్రముఖుం జూచి. ౧౯

సీ. తరుశాఖఁ గాళులంతగు లూన్చి యంతలోఁ జేతులు వట్టినం జేతు లూఁచి
మఱియుఁ గాళ్ళం బట్టి మొఱవెట్టి నాతని మెడమీఁద నిడుకొని పుడమి కుఱికి
బంటున కుచిత మగు పనికిఁ బంపక భిక్షుకుండు పీనుఁగు మోవఁగోరి పనిచె
నని దూఱఁగాఁ బిశాచాగ్రేసరుఁడు మీఁది కెగసి యెప్పటియట్ల తగిలియుండె
భూవరుండు మోసపోయితి నని తాను, మీఁది కేగి వీఁపుమీఁదఁ బెట్టి
కొనుచు డిగ్గి యేమియు ను బల్క నోడుచుఁ, గదలివచ్చెఁ గార్యగౌరవమున.

క. ఆయెడ బేతాళుఁడు జన,నాయకుఁ బరికించి వేఁడి నరవర భార
వ్యాయామము మఱచి సుఖో,పాయంబునఁ దెరువు జరుగునని కథఁ జెప్పెన్.

వ. అది యెట్లనిన. ౨౨

గీ. అఖిలలోకవిదిత మైన కాశీపురం,బునఁ బ్రతాపముకుటుఁ డనఁగ రాజు
కలఁడు వాని కిష్టకాంత సోమప్రభ, యనఁగఁ గలదు పేరు సార్థముగను.

క. ఆదంపతులకు సుతుఁడు ప్ర,మోదాకృతిఁ బుట్టె వజ్రముకుటుఁ డనంగా
మేదినిఁ బరఁగుచు నన్నఁగ, శ్రీదనరారంగ మరుని చెలువు వహించెన్. ౨౪

క. ఆరాజసుతుఁడు బుద్ధిశ,రీరుం డను మంత్రిసుతుఁడు ప్రియసఖుఁడుగ నా
నారూపవినోదముల వి,హారంబులు సలుపుచు న్మహావ్యసనుం డై. ౨౫

ఉ. ఇష్టసఖుండుఁ దా నడవి కేగి మృగంబుల వేఁటలాడుచుం
గ్లిష్టశరీరుఁడై కొలని క్రేవ జలార్థము చేరి కన్యకా
సృష్టికి నాద్యలో యనెడు చెల్వలు *గొల్వఁగఁ దారకాంతర
స్పష్టహిమాంశురేఖ కిది సాటియనం బొడఁగాంచె నొక్కతెన్. ౨౬

---

*గొల్వగ నొప్పు మంగళా, స్పష్టహిమాంశురేఖ కిది సాటియనందగు కొమ్మఁ గన్గొనెన్.

చ. అనుపమ బాహులోచనకుచాస్యకళ ల్గొనివచ్చినాఁడు తెం
డని బిసమీనచక్రనలినాంకుశ సీళ్ళను ముంచి వచ్చి శో
ధన మొనరించి చేకొను విధంబున నంబుగహారరంబు పొం
*తను విహరించు బాలికయు ధారుణినాథతనూజుఁ జూచినన్. ౨౮

క. ఇరువురచూపుల మదనుఁడు, శరములుగాఁ జేసి పులకసముదయ మొదవన్
నరి నయ్యిరువురమనములఁ, గరఁగించెఁ బ్రేమరసము గడలుకొనంగన్.

ఉ. అంబురుహాక్షి యప్పుడు ప్రియుంబున నొందలగల్వ పూవుఁ గ
ర్ణంబునఁ జేర్చి, దంతశిఖరంబుల ఘట్టనచేసి, పాదప
ద్మంబునఁ బెట్టి, వక్షమున దాఁపి, మనోగతి లక్షణంబు వ
క్త్రంబునఁ దోఁపకుండఁ, జెలికత్తెలు గొల్వఁగ నేగె నూరికిన్. ౨౯

క. ఇటనాతఁడు నా వజ్రముకుటుండు ప్రియసఖుఁడు దన్నుఁ గొల్వఁగఁ బురికిన్
దట నరుదెంచియు నొకచోఁ, గట నుండెం దెలియరాని †కనుబేటమునన్.

వ. ఇట్లా కన్నియ నామగ్రామజన్మప్రేమాతిశయంబు తెలుపఁగని మిగులఁ బొగు
లుచు దాని తగులు వగల నొగులుచున్న రాజకుమారుం దెలుపకుండుట
బుద్ధిగా దని బుద్ధిశరీరుండు దగ్గఱి నీ కింతచింత యేల విను మాకోమలి తల
మీఁదియుత్పలంబు కర్ణంబుతో జేర్చుకొనుట కర్ణోత్పలుం డనురాజుగలఁ,
డది దంతఘట్టితంబు సేయుట దంతఘట్టకుం డను దన్మంత్రి గలం, డది పద
పద్మంబున మోపుటం జేసి పద్మావతి యను, నది హృదయంబున నత్తుట
నీవ హృదయేశ్వరుండ, వని సూచించె నప్పుడే నిశ్చయించితి నాకర్ణోత్ప
లుండు ‡కుంతలదేశం బేలుచుండు నని వింటిమి. ౩౦

ఉ. ఆతనిమంత్రికూఁతు ధవదంగన గానొనరించువాఁడ ర
మ్మా తలపోఁత లేల యని మానవనాథతనూజుఁ గొంచు న
వ్వీతనిగూఢవేషముల నేగుచుఁ §గొంతలకంబు చేరి మా
[1]ద్గాతిథివృత్తి నొక్కతె గృహంబున నిల్చి యనుక్రమంబునన్. ౩౧

సీ. ఈపురం బేలురా జెవ్వఁ డాతని మంత్రి యెవ్వఁ డాతనికూఁతు రెవ్వరొక్కొ
యింతయు నెఱుఁగుదువే యని యడిగిన నుర్వీశ్వరుండు కర్ణోత్పలుండు
తన్మంత్రివర్యుండు దంతఘట్టకుఁడు తత్తనయ పద్మావతి యనఁగఁ గలదు
దానికి నే నిష్టదాసినై వర్తింతు నని యది చెప్పిన నాత్మఁ బొంగి

*నిలిచియున్న బాలికయు. †కనుజతనమునన్ ‡కళింగదేశం §నేగికళింగపురంబుసొచ్చి
[1]ద్గాతురవృత్తి.

మంత్రిపుత్రుఁడు తనమాట సిద్ధమైన, నతని నూఱడించి యదియ యటకు
దూతిగాఁగ మొదలుదొరకొని తమరాక, చెప్పిపుచ్చి రపుడు చెలియకడకు.

క. అది చని యొక రాకొమరుఁడు, సుదతీ సీతలఁ బెఱింగి † సుగుణత యొందం
గదియఁ జనుదెంచి సమ్మద, మొదవఁగ నాయింట విడిసి యున్నాఁ డనినన్.

వ. అద్ది విని గూఢభావం బేర్పడకుండ దానిని భర్జించి గోమయపంకంబునం గర్పూర మలయజ సాంద్రంబు లగు రెండుచేతుల దాని రెండుచెక్కులం దనపది వ్రేళ్లు నంట వ్రేసిన నది ఖిన్నవదనయై తిరిగి చనుదెంచి తత్ప్రతాపమానంబు సూపిన నారాకొమరుం డింక నాశ లే దని యుస్సు రనినం దత్సహచరుం డగు బుద్ధిశరీరుం డిట్లనియె. ౩౬

సీ. చింతింప కిఁక దీసి చెక్కిళ్లఁ దెల్లసి పదిరేఖలుగ వ్రేసి పంపుటరయ
నిది శుక్లపక్ష మీపదిదినంబులుఁ బుచ్చి ర మ్మని చెప్పుట నమ్ము మనుచుఁ
దెలిపి యాపదిదినంబులుఁ బుచ్చి యాదాసిఁ బ్రార్థించి యెప్పటియట్ల పనుప
నది తొంటిక్రియ మాటలాడఁగాఁ గుంకుమనూఱెడి సఖిఁ బిల్చి నోఁ మీఁద
దీని నడువు మనుచుఁ దెగి మూఁడువ్రేళ్లవ్రే, యుంచి వెడలనడిచె వంచనమున
మగిడివచ్చి కుంకుమద్రవాంకితముఁ లౌ, పెట్లు సూపె నది యభీష్టమమర. ౩౭

గీ. చూచి యానతేమిఁ ‡జూకురుఁబొందుచు, చచ్చుటొప్పు ననుచు వెచ్చనూర్పు
వజ్రముకుటుఁ బొగల వలదని తత్సఖుఁ, డానగలుగఁ దెలిపి దాసిఁ బిలిచి.

వ. ఆకన్నియ రజస్వల యై యుండంబోలుఁ గావున నెఱ్ఱగా నీమూఁడు వ్రేట్లు వ్రేయించి త్రోలించె నీమూఁడు దినంబులుం గడపి యింక నొక్కతో యం బె యరుగవలయు నని వేఁడుకొనిన నది యుం గ్రమంబున నాలుగవనాఁడు కన్యకాసౌధంబునకుం జని మగిడి వచ్చి. ౩౮

మ. నగుమో మొప్పఁగ నేఁటిమాట వినుచు న్నన్నాదరింపంగ నే
నుఁగు తిద్వాళి మదించి కంబము వెస న్నుగ్గాడి యేతెంచిన
న్నాగనాల న్వ్రాడలంగ రా దనుచు నంభోజాక్షి పీఠంబుపై
డిగజాఱి న్ననుఁ ద్రాటఁ గట్టి విడిచెన్ డంబు బిట్టుల్లఁగాన్. ౩౯

క. అనవుడు తన్నార్తంబునఁ, జనుదెమ్మను టయ్యె ననుచు జనపతిసుతునిం
గొనిచని యాపీఠముపై, నసిపె నతసి మీఁదివార లటు చేఁదుకొనన్. ౪౦

† సుందర మొదవఁగ - సుగుణతనమునన్. ‡ స్రుక్కుచుఁ బొక్కుచు.

శా. ఆసాఢాంతరసీమ రత్నమయపర్యంకంబుపై నుండి త
ద్దాసీలోకకృతోపచారుఁ డగుచుం దాంబూలపుష్పాదు లు
ల్లాసం బందఁ జెలంగి కైకొనుచు బాలస్నిగ్ధదేహం బరీ
హాసోక్తిం బరికించి రాకొనుచుఁ డేకాంతంబునం బ్రోడయై. ౪౧

క. తలఁపునకుం జొంగను నగ్గల మగుతమకమున బాలఁ గౌఁగిట నిడి మైఁ
బులకలు మొలవఁగఁ దలకొని, చులుకగ రతిసుఖముచవులు చూపుచుఁ గవిసెన్.

ఉ. ఈగతిఁ బెక్కునాళ్ళు సుఖియించుచు నుండి విదేశభూమిలో
నేగతి నున్నవాఁడొ తన యిష్టసఖుం డని యిచ్చలోనఁ జిం
తాగతుఁ డైన దీనికిఁ గతం బిట నేటిది చెప్పు మన్న నా
త్యాగమనంబుఁ దన్మతియు నాతని యున్నియుఁ జెప్పె నేర్పడన్. ౪౩

క. అది విని నీకాపుఁడు నా, హృదయస్థితి యెఱుఁగు జాణఁ డీక్రియ దాసీ
సదనమున నాఁగులుచుండఁగ, నది యేలా చెప్ప వాతఁ డాప్తుఁడు గాఁడా.

క. అతనికి విందొనరింతం, జతురుఁడు నను మెచ్చఁ బాయసముఁ బక్వాన్నా
న్వితముగ ఘృతముం గొనిచని, యతిముదమునఁ బెట్టియింటికరుదెమ్మనుచున్.

సీ. ఆపదార్థములు రయమ్మున సమకూర్చి యాత్రాఁడు వెంటనే యనుప నతఁడు
చని దాసిగృహమునఁ దన యిష్టసఖుఁ గాంచి బాలిక యిదె పంపు కానిచె ననిన
నకట నాయుష్టిఁ జెప్పరి యుండ నైతివి తమకిందఁ జిత్తంబు దరలఁ గాన
నతు లిష్టుచెలికాని సైతురె నాకును విషము వెట్టెడి దొడ్డ విందు వనిచెఁ
జూడుమనుచు నతఁడు శునకంబునకుఁ బెట్టె, నదియుఁ దినుటతడవె యువనిఁ గూలె
నెదిరి వారించి తమెఱిఁగి వర్తించెడు, వారికేల కీడు వచ్చు నరక. ౪౬

వ. ఇట్లు దృష్టాంతంబు చూపి నిశ్శంకగూఢంబున నేగి యతనికి భోజనంబు వెట్టితి నని చెప్పి మధుపానమత్త యగు నమ్మత్తకాశినికి లోఁదొడ గోరు నాట మూఁడు పోటులు వరుసం బొడిచి పాదభూషణమ్ము గొని రమ్మిటఁ గార్యంబు చూచుకొందము ని యడిపిన నతండు పని యాక్రమం బొనరించి యందియఁ గొని వచ్చిన. ౪౭

ఉ. అక్కడ మాని తత్పురి యుపాంతమున న్మసనంబులోన గో
రక్షుఁడు మీననాథుఁడు ధరం జరియించుచు విశ్రమార్థ మై
యొక్కెడ నిల్చినారో యన సిద్ధులు నుద్ధతి సిద్ధవేషు లై
యొక్కమఠంబు గట్టుకొని యుండిరి శూలము కేలఁ గ్రాలఁగన్. ౪౮

క. ఒకనాఁ డటు కర్ణోత్పలుఁ, డికొఁడుకు మృతుఁడైన నెఱిఁగి నీతివిదుఁడుమం
త్రికుమారుఁడు నృపసుతుచే, తికి నూపుర మిచ్చి సంతఁ ద్రిప్పఁగఁబనిచెన్.
క. అమ్మెద నని చూపుము తెగ, నమ్మకు మఱి దీనిజాడ లడిగిన నీచి
త్తమ్మునఁ గలఁగక నా కీ, సొమ్మిచ్చెను గురుఁ డటంచుఁ జూపుము నన్నున్.
సీ. అనవుడు నొఁగార యని పురంబున కేగి యంగడి నమ్మఁజూపంగ నొక తె
మఱపాప సొమ్మని మంత్రికిఁ జెప్పిన నాతఁడు సొమ్ముతో నతనిఁ బట్టి
పృథివీశుముందఱఁ బెట్టినఁ గలుషించి చెప్పరా యిది యెట్టు చేరె ననిన
నే ముచ్చుఁగాను మీ కీజాడఁ జెప్పెద బంటుల నా వెంటఁ బనుపు మనుచుఁ
గొందఱు కాఁపులన దోడుకొనుచువచ్చి, నాకుసొమ్మిచ్చెనీగురునాథుఁడనుచుఁ
జూప వారలుమదిఁ గుఱుఁజోద్యమంది, యట్టివేషంబునకు సంశయంబునొంది.
క. ఓగురునాయక యీ సొ, మ్మేగతి నినుఁ జేరెఁ జెప్పనేతె మ్మనినన్
జోగులము మేము మాకట, రాఁగూడదు గాన రాజు రమ్మనుఁ డిటకున్.
క. అతనికిఁ జెప్పెద మనవుడు, నతివేగమ యేగి వార లటు వినిపింపన్
క్షితిపతియును మతి నతివి, స్మితుఁడై చను దెంచి కపటసిద్ధుని మ్రోలన్.
క. వినతుఁడై యున్న యాతని, గనుఁగొని నీపీట దంతఘట్టకుసుత డా
కిని వై యీమసనములో, నను రాత్రులు దిరుగు నది దిగంబర యగుచున్.
క. ఈరాత్రి నీకుమారుని, మారిమసఁగినట్లు చంపి మలయఁగ నేనా
ఘోరాతిశూలనిహతిఁద, దూరుస్థలి నొంచి చరణ మొడియఁగ నెగసెన్.
క. కాలు విదిర్చిన నందియ, కీలెడలినఁ బుచ్చుకొంటి క్షితినాయక యే
స్త్రీలను జంపరు గావున, నాలలనను వెడలనుపు మంతియ చాలున్. గీ.
క. అనవుడు వెరఁగంది భయం, బున మంత్రితనూజసౌధమున కంగనలం
బనిచి తొడపైఁ ద్రిశూలం, బునఁ బొడిచిన యట్టులున్న *పోటులు దెలిసెన్.
గీ. తెలిసి శోకరోషకలుషుఁడై యారాజు, మగిడి పురికి నేగి మంత్రికూఁతు
దయ్యమనుచుఁ బ్రజలుదలఁకఁగా వెడలఁగొ, ట్టించెఁజూడనిదికడిందియనుచు.
శా. ఆకన్యామని దుఃఖమూలమునఁ బ్రాణాంత్యంబు చింతింపఁగా
నాకాశీపురరాజపుత్రకుఁడు వ్యాఘ్రాకారుఁడై తన్నన
శోకం బార్చుచు †వెజ్జుజోగిఁ దనయిష్టుంగా నెఱింగించి య
స్తోకం బా నిజరాజ్యముం దెలుపుచుం దోడ్తెంచు నేగెం బ్రియున్. గీ.

*భూపతిదెలిసెన్ †వేద్యజోగి.

క. తదనంతరంబ యొక నాల్గుదినములకు దంతఘట్టకుఁడు పతియును దా
మదిఁ *గూఁతుశోకదహనము, పొదివినఁ బరలోకమునకుఁ బోయెం బెలుచన్.

క. ఆపాపము గడపటఁ గా, శీవతిపుత్రుండా యతనిచెలికాఁడో యీ
భూపాలుఁడో వీరలలో, నేపురుషుం బొందుఁ జెప్పు మెఱిఁగినకొలఁదిన్.

సీ. ఎఱిఁగి చెప్పకయున్న నిప్పుడే నీతల పదివ్రక్కలై పడు నిది నిజంబు
కావునఁ జెప్పుమా నావుడు నీఁక నూరకుంట మానం బని యుర్వీవిభుఁడు
కామాతురుం డౌచుఁ బ్రేమ రాకొమరుండు †తనవనిఁగాఁ జేసికొనుటఁ దగవు
సచివసూనుఁడు నిజస్వామికార్యమునకు మర్మంబు సేయుట ధర్మపథము
తలవరులచేత వానివర్తనము లెల్ల, మొదలఁ దెలియక యదినిజంబుగఁ దలంచి
చేసెఁ గావున దురితంబు చెందుఁ బ్రభుని, రాష్ట్రకృతమైనపాపంబు రాజుఁ బొందు.

క. అనవుడు బేతాళుఁడు సమ్మదమునఁ గొనియాడి యతని మౌనత్యాగం
బున నిలువక యెగసి రయంబునఁ జని తరుశాఖఁ దగిలెఁ బూర్వస్థితితోన్.

వ. ఇట్లు విడిపించుకొని పోయిన. ౬౪

క. ఆనరపతి క్రమ్మఱఁ జని, పీనుఁగు క్రియ వీఁపుమీఁదఁ బెట్టుకొని చనం
గా నొకకథనెపమున నమ్మానము విడిపించి యతఁడు మగుడం బాఱెన్.

వ. ఇట్లు మొదలికథంబోలె సారెసారెకుం గథలు చెప్పి మఱుఁగులైన సదుత్తరంబు లందుచుం బరికించుచు నిరువదియేనుమాఱులు దాఁక రాకపోకల నలయించి యతనివివేకంబునకు స్థిరోద్యోగంబునకుం బరిణమించి బేతాళుండు మేలొనగూర్పం దలంచి. ౬౬

క. నరనాథ సర్వలక్షణపరిపూర్ణుఁడ వంచు నిన్ను బలిసేయ మదిం
బర్కించి కపటభిక్షుకుఁ, డరుదుగ ననుఁ దోడితేర ననుపుట గంటే. ౬౭

గీ. నన్నుఁ గొంచు నేగ నిన్ను నుసాష్టాంగ, మెఱుఁగుమనిన మ్రొక్క నెఱుఁగఁ దొల్లి
నేఁడు నిన్నుఁ జూచి నేర్చెద నిప్పుడు, మ్రొక్కి చూపు మనుము మోసపోక.

క. ఇటు మ్రొక్కుమనుచుఁ జాఁగినఁ, దటుకున నడిదమున వాని తల ద్రెంచి సను
త్కట మగు ననలములో నొ, క్కట వైవుము సిద్ధులెల్ల ‡గతివడు నీక్షన్.

చ. అనవుడు నట్ల యియ్యకొని యాతని మూఁపునఁ బెట్టుకొంచు దె
చ్చిన మది మెచ్చి వాఁడు మును చెప్పిన రీతిని మ్రొక్కుమన్న నే

* గూఁతుశోకదహనంబున † తనదానిగా ‡ గనఁబడు.

రని క్రియఁబల్లిన న్నతి ధరం బ్రణమిల్లిన శాని మస్తకం
బనువునఁ ద్రెంచి పావకున కాహుతిగా నొనరించి సిద్ధుఁడై. ౨౦

గీ. ఆత్మరక్షణాధ్యుఁ డగువాని నటు వేల్చి, నంత భూతనాథుఁ డతని మెచ్చి
యెప్పుడైనఁ దలఁపు మేవచ్చి నిల్చెద, సిద్ధు లెనిమిదియును జెందునవియు.

క. సుర లటు పేర్కొని విద్యా,ధరరాజ్యము గలుగనొసఁగి తద్గుణముల క
చ్చెరు వందుచు నేగిరి భూ,వరుఁడును బేతాళునవిపి వచ్చెం బురికిన్.*

శా. ఈసామర్థ్యము నేర్పుఁ దెంపు నణిమాధీశత్వము న్లేక నీ
క్షీసింహాసన మెక్క జూనె మదిలో నీక్షింపు మా యన్న ను
ల్లాసం బెల్లఁ దొలంగి తద్గుణగణశ్లాఘాపరుం డౌచు ల
జ్జానంగవ్యథఁ గ్రమ్మఱం జనియె భోజక్ష్మాంభుం డింటికిన్. ౨౩

— ముప్పదిరెండవబొమ్మకథ. —

క. తదనంతరంబ యా ము,ప్పదిరెండవబొమ్మయైనఁ బద మిడు మని స
మ్మదమున నిఁకఁబల్కెను నని, మదిలో వలఁదలఁచియతఁడుమఱునాఁడెలమిన్.

క. సన్మునిహృదయారాధితుఁ, జిన్మూర్తిఁ గృపావిశేషు శేషాభరణు
న్మన్మథమదగజకేసరి, జన్మజరామృత్యురహితు సర్వేశ్వరునిన్. ౨౫

క. డెందంబునఁ దలఁపుచు సం,క్రందనమణిపీఠ మెక్కఁ గడఁగెడు నెడ నా
కందువ నిలిచిన బొమ్మ వ,సం దిన్నని నగవుతోడ జనపతిఁ బలికెన్. ౨౬

చ. వలదన నేల యిట్టి దురవస్థలఁ బొందఁగ నేల నీకు భూ
తలమున విక్రమార్కుగతి ధర్మము సత్యము సాహసంబు ని
శ్చలముగ నిల్పలేని మనుజప్రభుఁ డీదెస మెట్టఁజూచినం
దలఁపులు నిష్ఫలంబు లగుఁ దత్త్వ మెఱుంగని బుద్ధి నిన్నిటన్. ౨౭

చ. అతని గుణక్రమం బెఱుఁగు మయ్య భుజాబలభీముసేనుఁ డా
తతరణకౌశలార్జునుఁడు ధర్మయుధిష్ఠిరుఁ డార్తరక్షణా
చ్యుతుఁడు కృపాదిలీపుఁ డరిసూదనభార్గవుఁ డర్థబోధవా
క్పతి విభవామరేంద్రుఁ డనఁగా నత డుజ్జయినీపురంబునన్. ౨౮

చ క్రతువు లనేకము ల్నడిపి గౌరవ మేర్పడ నుర్వి సప్తసం
తతులును నిల్పి వేదనినదంబులు విప్రగృహంబులందు నిం

---

*ఈకందమునకు మాఱుగా, వ. అనిన నట్లు విక్రమార్కుండు సంకల్పసిద్ధుండయ్యెఁగావున-
అని యొక ప్రతిలోఁ గల

తరము౯ దెలంగ దీను లతిదానముల న్నిగడంగ ధర్మసం
గతి మెఱయించె రాజపవికారము లెవ్వియు౯ జెందకుండఁగ౯. ౭౯

చ. కలువులపై రడంచి యుదకంబుల నెప్పుడు నర్ణవాకృతిం
జెలువులు నిండియుండఁ దమసీమలఁ దప్పక నాల్గుజాతులుం
దలచుగ ధర్మము ల్నెఱపఁ *దస్కరజాతుల నప్రమత్తత
న్నెలయఁగనీక సజ్జనులు మెచ్చఁగ శాశ్వతకీర్తికాముఁడై. ౮౦

ఉ. అంబుజమిత్రు వంశ మని యార్యులు సన్నుతి సేయఁగా సము
ద్రంబులు నాల్గుమేర లగు ధారుణి యంతయు నేలుచుం బ్రతా
పంబున రాజు లెల్లఁ దన పంపు చరింపుచుఁ గొల్వఁ గార్యఖ
డ్గంబుల వైరులం దునిమె గట్టిగ సత్యము నిల్పుకోరికి౯. ౮౧

సీ. సత్త్వంబునను మహాశ్చర్యంబుగా గెల్చి వసుధేశులను వాత్మవశులఁ జేసి
వరరత్నకనకాది వస్తువు లన్నియుఁ దనసొమ్ముగాఁ జేసికొని యతండు
హయమేధములు మొదలైన యాగములందుఁగూడి దేవత లెల్లఁ దోడుపడఁగ
బడుగులు వేఁడినఁ బ్రాణంబు లైనను వంచింప కొసఁగెడు వ్రతము వట్టి
సర్వదిక్కులందుఁ జాటించి యర్థులఁ, గూడఁ దిగిచి వారు గోరినట్లు
యాళ్ళు నర్థమును యథోచితంబుగ నిచ్చి, శాసనంబుగాఁగ శక మొనర్చె.

వ. భువిలో నభూతపూర్వంబు నద్భుతంబు నగుకృత్యంబు శకం బనంబరుఁ
దొల్లి జరుగు శ్రీరామశకంబు యుధిష్ఠిరశకంబు నణంచి నిజశకంబు నిల్పిన
నందానందాది సంవత్సరాద్యమ్మున విక్రమార్కశకంబై చతుర్లక్షజ్యోతి
శ్శాస్త్రగతిప్రవర్తకం బయ్యె ౮౩

గీ. నదుము శాలివాహనశకంబు గలిగియుఁ, జెడక యుత్తరమునఁ బుడమిలోన
నెన్నిచూడఁ బదియు నెనిమిది వేలఁకు, లతనిశకము రూఢినలరఁగలదు. ౮౪

క. ఈపాటి మహిమ గుణములు, నీపాలం గలిగె నేని నేఁ జెక్కు వృథా
టోపంబులు వల దని యో, క్ష్మాపాలక నిన్ను మాన్పఁ జలమో ఫలమో.

క. అని చెప్పి మఱియు నాతని, మన మలరఁగఁ బలికె నిన్నిమా టులు మానే
ర్పున నతనిమహిమగొలఁది, †నిన్వివసింపించితి మింతెకాక నీవల్పుఁడవా.

క. నరనారాయణులనఁగాఁ, బరఁగెడు హరిమూర్తు లుర్వి ఫల్గునదామో
దరులై పుట్టిరి నాఁడా, నరుఁ డతఁడై పుట్టినాఁడు నరవరతిలకా. ౮౭

* దస్కరజాతుల † వినిపించిననింత నేమి.

క. ఈకలియుగమున విద్యల, కేకడఁ జేపట్టు లేమి యెఱిఁగి పలికి వా
ణీకాముని వినిపించిన, నాకమలభవుండు సెప్పె నచ్యుతుతోడన్. ౮౮

*గీ. అచ్యుతుండు విద్యలైశ్వర్యమునఁ గాని, మెఱయ వనుచుఁ జెప్పి యెఱుఁగఁగలుగ
నరునిఁ బుట్టఁ బంచె నరపతిత్వము గోరి, యతఁడు నవని నీవనై జనించె.

క. నరునకు నారాయణునకు, నరయఁగ భేదంబు లేదు హరి యొక్కఁడు న
య్యిరువురయూపగుఁ గావున, వరపుగఁ బరికింప నీవ విష్ణుఁడ వనఘా.

క. ఈపుణ్యుని నినుఁ జూచిన, శాపావధి గలిగెఁ గల్మషం బఱఁగెఁ గుహో
ద్దీపక! "నావిష్ణుః పృథివీపతి" యనుకీర్తి నీకు విహితం బయ్యెన్. ౯౧

చ. అన విని చోద్యమంది వసుధాధిపుఁ డప్పటి శాపకారణం
బానరుఁగఁ జెప్పు మెవ్వ రని యుత్సుకుఁడై తను వేఁడినం గ్రమం
బున నది క్రమ్మఱం బలికె భోజనృపాలక! పార్వతీసఖీ
జనులము నేము దేవి కనుసన్నల దగ్గఱి కొల్తు మెప్పుడున్. ౯౨

క. ఒకనాఁ డేమును నయ్యంబికయును విశ్రాంతి కేగి శుకపికభృంగ
ప్రకరపరిలోపకర మగు, నొకవనమున విరులు గోయుచున్నద వేడ్కన్.

సీ. కన్నుల విని గాలిఁ జెన్నొందు నందియు యనుగుఁదమ్మికి బెడఁగడరఁ జేయు
నందిని నులికించు పెందోలు హొంబట్టుకై వడి నునుపారఁ గాసెవోసి
తలఁచినయంతనె వలపులఁ దలకొల్పు వెలిపూఁత మేనెల్లఁ గలయఁబూసి
జక్కవకవ కదురెక్కుడై రేవెలుఁ గెలమితో జడలపై వెలుఁగుచుండ
విసము మెడనుండియును దీపి¶ వెలికిఁ దోఁపఁ, గేలశూలంబు ఫణిపతిలీల మెఱయ
మిండజంగమై యామంచుఁగొండకూఁతు, నెదుటికరుదెంచె ముక్కంటిచదురులాఁడు

క. ఆచందము గనుపట్టం, జూచిన యావేళ మనసిజుఁడు మున్నుఁ దెగం
జూచి తనకమ్ముఁదూపుల, మాచిత్తములెల్లఁ గరఁచె మానము లెడలన్.

క. పులకించెఁ జెక్కు లలికం, బుల లేఁజెమ రొత్తె నధరముల నద రొదవెన్
వలువల గనయము లూడెం, †బలుకమఱచియుంటిమేము ప్రతిమలమాడ్కిన్.

క. ఆతఱి నయ్యంబిక మా, చేతోగతు లెఱిఁగి కనలి చెలిమికి వెలిగా
భూతలమునఁ ‡బుత్తళులై, చైతన్యము లుడుగుఁ డనుచు శాపం బిచ్చెన్.

---

* అచ్యుతుండ విద్యలైశ్వర్యమునఁ గాని, మెఱయవనుచుఁ జెప్పి యెఱుకగలిగి
యవనిబుట్టఁబంచె నావారియిపుడు నీ, వైజనించినాఁడ వవనిపాల.

¶ దీపి + బలుకక మఱచుంటిమేము ‡ బుత్రికలై.

ఉ. ఆ క్రియ శాప మిచ్చిన భయంబున నందఱ మాత్మ లజ్జ ర
త్యాక్రియ నన్ని పాత ముకుగంబకు నైవడిఁ గామినిక్రియో
పక్రమ మూసకం దెలిసి పార్వతికిం బ్రణమిల్లి తల్లి మా
శక్రియ శాపమోక్ష మగు నింత దలంచుట మాతృకృత్యమే! ౯౮

మ. అనుచుం బ్రార్థన చేసిన న్వాని కృపాయత్తాత్మయై మీరు కాం
చనపాంచాలికలై జనించుఁ డొక ప్రస్తావంబునం బుణ్యవ
ర్తనునిం జెప్పఁగ వాక్యసిద్ధి యగుఁ దత్కాలంబు మీశాపమో
చనమాఁ బొందని వీడుకొల్పిన మనస్తాపంబునం బిమ్మటన్. ౯౯

వ. ఒక్కమాత్రే భూలోకంబునకు రానోడి, మాసంప్రార్థన విశ్వకర్మనిర్మితం బగు నయ్యింద్రసింహాసనంబున నట్లుండి పదంపడి భూమికి వచ్చి యీ పుత్తమ నాయకు గుణకథనార్థమై నిన్నిన్ని మాటలు వారించితిమి. నా పేరు శృంగారతిలక యనం బరఁగు, వీరలు జయయు ను, విజయయు, మలయావతియు, ననంగసంజీవనియు ను, గంధర్వసేన యుఁ, బ్రభావతియు, సుప్రభయు, సంభోగనిధియు, సుభద్రయుఁ, జంద్రికయు, కురంగనయనయు, ననంగధ్వజయు, నిందువదనయు, విలాసరసికయుఁ, గోమలియు, సౌందర్యవతియు,లావణ్యవతియు, లజ్జావతియు, నిందుమతియు, జనమోహినియును, విద్యాధరియు, హరిమధ్యయు, సుఖప్రదాయినియుఁ, బ్రబోధవతియు, మలయవతియు, హంసగమనయు, నంగసుందరియు, సుకేశియుఁ, జతురికయు, హేమాంగియుఁ, దలోదరియు, *నను పేరులు గలవారని యెఱుంగు మిట్టి మేమును- ౧౦౦

క. బొమ్మలమై యీమణిపీ,ఠమ్మున బహుకాలముండి డస్సితి మని చి
త్తమ్ములఁ బొగులఁగ మాభా,గ్యమ్మున నీతోడ మాట లాడంగలిగెన్.

క. కష్టంబు వీడె నీకే,యిష్టం బది వేఁడు మిప్పు డిచ్చెద మనినన్
సాష్టాంగ మెరఁగి భోజుఁడు,హృష్టుండై పలికె వారిహృదయము లలరన్.

క. మీకృప సంపద లన్నియు, నా కుండఁగ నేమి ప్రార్థనము భవదీయా
లోకము గలిగెను బుణ్య,శ్లోకుఁడ నైయుండఁ గంటి గోకులు వొగడన్.

క. అని వినయోక్తులు పలికినఁ, గొనియాడుచు నిలిచి రాజకుంజర నీచే
సిన యుపకారమునకు నే, మని ప్రత్యుపకృతి యొనర్ప నగ్గము మాకున్.

---

* మనోహరియు, హాసవతియు, పద్మపాణియు, నీలవేణి, శుకవాణియు, పులినశ్రోణియు, నిరుపమయు నను పేరులు ప్రత్యంతరములలో నున్నవి. వీనిం జేర్చిన ౩౨ నగు మించినవి.

చ. సకలకళా ప్రవీణుఁడవు సజ్జనరక్షణదక్షిణుండ వం
ధకరిపుభక్తిశీలుఁడవు దానవినోదివి సర్వభావభా
వకుఁడవు విష్ణుమూర్తివి దివానిశముం గవిపారకార్థిగా
యకనుతిశాలి వుర్వీపతి వల్పుఁడ వా భువి భోజభూవరా! ౧౦౫

శా. నీ కేవాంఛయు లేకయున్న వినుమా నిన్నవ్వఁ డీక్షించినన్
మూకిష్టంబు సరస్వతీవిభవ మామర్త్యుండు వేపొందు, వా
క్ప్రాథుండై విలసిల్లఁ జేసెదము భూపాలాగ్రణీ నీయశం
బాకల్పంబుగ నొప్పఁగాత జనలోకానంద మై సాంద్ర మై. ౧౦౬

సీ. కన్ను లయ్యును బండికన్నులయ్యును జంద్రసూర్యులెవ్వనికడసొంపుగనిరి
సుతుఁడయ్యురథముపైసూతుఁడయ్యునుసురజ్యేష్ఠుఁడెవ్వనికడశ్రేష్ఠుఁడయ్యెఁ
దల్పంబునయ్యు నాకల్పంబు నయ్యు నాగేంద్రుఁ డెవ్వనికడ నెన్నఁబడియెఁ
బదమయ్యు మస్తకాస్పద మయ్యు నాకాశమధ్య మెవ్వనికడ మహిమ కెక్కె
నట్టి యుభయమూర్తి హరిహరనాథుండు, దేవదేవుఁ డిష్టదైవ మగుచు
నెరయఁ బ్రోచుఁగాత నీకొల్వువారల, భూజనేంద్రభూజ భోజరాజ. ౧౦౭

క. పర్యాప్తంబుగఁ గథ లీ, మర్యాద న్వినియట్టి మానవునకు నౌ
దార్యంబును దెగువయుగాం,భీర్యమ్మును బ్రియమునయముఁ బెంపువహించున్

మ. అని దీవించి యుమాసఖీజనులు దివ్యాకారసంపత్తి సొం
పున నాకాశమున న్మెఱుంగులక్రియం బొల్పారునుల్లాసనం
జనితప్రౌఢవచోవిలాసముల నాశ్చర్యంబు రెట్టింప నా
జను లెల్లం దముఁ జూడఁగాఁ జనిరి భోజశ్రేష్ఠు నగ్గించుచున్. ౧౦౯

శా. భోజేంద్రుండును నెక్కరాని హృదయాంభోజంబులోఁ గాంచి ని
ర్వ్యాజం బై విలసిల్లు యత్నమున విద్వత్సన్నిధిన్ దాని నిష్టైఁ
దేజోమూర్తిఁ ద్రిలోకవంద్యుని *మహాదేవు న్మనున్ శిల్పిత
త్పూజాలబ్ధ వరప్రసాదమహిమన్ భూమండలం బేలఁగన్. ౧౧౦

శా. సద్యోనిర్ణయ వాదులు న్సరసులు †స్సంగీతకావ్యక్రియా
విద్యావంతు లనంతశిల్పరచనావిజ్ఞానులు న్సర్వసం
పద్యోగ ప్రథమానకీర్తియుతులు న్సామామనోరంజనా
హృద్యాకారులుఁ బుణ్యవర్తనులు నై యేపారి రుర్వీజనుల్. ౧౧౧

---

* మహాదేవున్నిపున్ శిల్ప. మహాశివుం దగన్ శిల్ప † సంగీతవాద్యక్రియా.

మ. అనుచుం జెప్పిన నద్విజాతి మిగులన్ సంతోషించి యాదేవ యే
నును బూర్వంబునఁ గొంత వింటిఁ బిదపన్ మ్మాహాత్మ్యప్రసంగంబున
న్వినవింపాగతి నేఁడు విస్తరముగా వింటి న్మహావీరుఁ డా
తనిసామర్థ్యము నిష్ప్రపాదమునఁ జెప్పెం బమ్మ్యో మృత్యుంజయా. ౧౧౨
క. *నాకోరిన కథలెల్లను, నీకతమునఁ దెలియ నానతిచ్చితి దేవా
యీకలియుగపర్యంతం, బీకథలు ప్రసిద్ధి కెక్కు నిట నీకరుణన్. ౧౧౩
మ. †అని యీరీతి సుమామహాసులకు సాంద్రానందసంధానమై
విననింపై కవిసమ్మతిస్ఫూర్తి మై పద్యస్థనదృశ్యమై
వన మై పావన మై మహాసనకథాద్వాత్రింశికన్నామృతం
బన నెల్లప్పుడుఁ జెలుఁగాలి భువిలో నాచంద్రతారార్కమై ౧౧౪
శా. అంభోరాశిజలప్రపూర్ణవిపులవ్యాప్తివ్యాసక్తచిత్తాంబుజం
గుంభీసంభవముఖ్యసర్వమునివాగ్గుంభసుతారంభునిన్
జంభారాతిసమీహితాయనమహాస్తంభాంతసంభూత సం
రంభాటోపవిదారితారివరుఁ బ్రహ్లాదప్రతిష్ఠాపరున్. ౧౧౫
శా. బాణాగారముఖాభరత్నగుణప్రారబ్ధ యుద్ధక్రియా
క్షీణోపేంద్రసుహృత్త్వకృత్యుని దృఢాంగీకారసన్నాగిగీ
ర్వాణాధీశసమర్చితాంఘ్రియుగళు న్సామాంగకస్య సశ
ర్వాణీమగ్నమనోంబుజుం ద్రిభువనావష్టంభునిన్ శంభునిన్. ౧౧౬
మాలిని. నవహిమకరజూటా నందితామర్త్యకూటా
జవనవృషభవాహా శంఖచక్రాంకదేహా
ధవళభుజశరీరా దానవధ్వంసకారా
శివమురరిపురూపా శిష్టదృష్టస్వరూపా. ౧౧౭

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళ కళింగదేశసర్వామధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్ర మహారాష్ట్ర భూపాలరూపనూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వర రాజ్యసముద్ధరణ శ్రీకొఱవి విన్నయామాత్య పౌత్ర హరితసగోత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితం బయిన సింహాసనద్వాత్రింశిక యనుకావ్యంబునందు బేతాళహరణంబును, బద్మావతి యితిహాసంబును, విక్రమార్కుని యష్టప్రసిద్ధిసంసిద్ధియుఁ దన్మహాసామర్థ్యంబును, బొమ్మలకావాగమన మోక్షప్రకారంబు నుదదీయ నిజస్వరూపప్రాప్తియు నన్నది సర్వంబును ద్వాదశాశ్వాసము.

---

* నాకోరినకోర్కెలనియు, † అనుచుఁబార్థివుచేతఁ గావున నరేంద్రానందసంధానమై త్రిభువనవ్యాపారపారీణునిన్.